శ్రీరస్తు.

# కాళింగమర్దనము.

ఇది

మంగు వేంకటరంగనాథరావువలన
ముద్రించి ప్రకటింపబడియె.









మొదటికూర్పు 1000 ప్రతులు.



కాకినాడ.
1914
శ్రీవేంకటేశ్వర విద్యానాగరి ముద్రాక్షరశాల.
వెల 0—1—0



శ్రీరస్తు.

# కాళింగమర్దనము.

సీ. శ్రీవిభుఁగొల్చి శంకరుని సన్నుతిజేసి వారిజాసనుమదిఁగోరికొలిచి
గణపతిఁబూజించి ఘనులైన యామాని వ్యాసాదికవులను వరుసఁదలచి
ముందుసరస్వతిమోదముతోనూహించియందముశృంగారమమరజేసి
భూసురపాదాబ్జముల భృంగమై యొప్పి వాసనగల కాళిదాసు దలచి
గీ. కృష్ణచరితల వేడుకగేలుఁగొల్చి, పరగకృతిజేతు జగముల బ్రౌఢిమీఱ
తప్పుగలదేనికవులారదగిననేర్పు, లొప్పుమీఱగదిద్దుచునోపరవలయు.

ఏకతాళము—భావములోతగుదేవిని యమృతపు - తావినిమ
దిసిరిదేవినుతింతుఁ ॥ ౧ ॥ అతులితముగ మునితతులనుబ్రోచిన చతురు
నిగౌరీపతినిభజంతుఁ ॥ ౨ ॥ ఏణాక్షినిమృదుపాణినిపద్మజు - రాణినిజ
కృతినివాణిదలంతుఁ ॥ ౩ ॥ పాయకనమస్కృతిసేయుమునులకిష్ట - దా
యకుఁడైన వినాయకుఁగొలుతుఁ ॥ ౪ ॥ పరివిమలరసగుణభావాలంకృత
కవులగునాదిమకవులనుతింతుఁ ॥ ౫ ॥

వ- అనికృతిరచనాపరుండును దేవదేవుండునునైన, శ్రీపార్థ
సారథిస్వామినేమని వర్ణింపుచున్నాఁడు ॥

జంపె ॥ యదుకులంబునఁబుట్టి యతులమన్నించుటకు - సదయు
డై శ్రీపార్థసారథై వెలసెఁ ॥ ౧ ॥ బృందావనమునను బొందుగానెలకొ
న్న - చందనార్చిత పార్థసారథై వెలసెఁ ॥ ౨ ॥ పార్థివేశ్వరులెల్ల
బ్రీతినుతింపగాజాల - బర్థునకుసారథై ప్రీతిగావెలసెఁ ॥ ౩ ॥ కంతున
కుదండ్రియై ఖలులఖండింపుచును - సంతతము శ్రీపార్థసారథై వెల
సెఁ ॥ ౪ ఇలనుదినవలికేళినేలమివై భవములకు - సంలలితముగ పార్థసా
రథై వెలసెఁ ॥ ౫ ॥

వ॥ అనిమరిన్నె మని కీర్తించుచున్నాడు॥

త్రిపుట॥ ధరణిభారముదీర్చుకొరకై దానవులఖండించి మించిన పరమపావనుడైన శ్రీహరిభక్తిగొలుతుఁ॥ ౧॥ పాండవుల మన్నించి ద్రౌపదిపాలగలిగి - మించిన దండిరాజులగొట్టినట్టిమాధవునిగొలుతుఁ॥ ౨॥ వింతగారేపల్లెలోపలసంతతముగోవులనుబ్రోచిన - వంతకారై వెలయుశ్రీహరివరునగొలుతుఁ॥

వ॥ అని వినుతిసేసి యాదేవునకు షష్ట్యంతంబులు సెప్పెనటుటువలెను॥

అర్ధచంద్రికలు॥ పూతనగూల్చిన భూపాలునకుఁ॥ ౧॥ మద్దులగూల్చిన ముద్దులహరికిన్॥ ౨॥ మల్లులదుంచిన మధువైరికినిఁ॥ ౩॥ కంసునిగొట్టిన కంజాక్షునకుఁ॥ ౪॥ గిరిద్రిపనెత్తిన కేశవునకును॥ ౫॥ దురితములణచినమురవైరికిని॥ ౬॥ కరిపతిబ్రోచినకమలాపతికిఁ॥ ౭॥ శకటునిగూల్చిన సర్వేశునకుఁ॥ ౮॥ గోవులబ్రోచిన గోవిందునకుఁ॥ ౯॥

వ॥ అని యంకితంబుగా నామొనర్చంబూనిన మహాప్రబంధంబైన కాళింగమర్దనంబను యక్షగానంబునకు కథాక్రమంబెట్టిదనిన॥

ద్విపద॥ శ్రీరామకృష్ణులు చెన్నొందవేడ్క - ధారుణీభారంబు దగదీర్చుటకును - దేవకీవసుదేవ దేవులకర్థి - బాలసంబుగబుట్టిబహుచరితముల - నందునియింటను నయముతో బెరిగి సుందరాకారశోభిల్లి మరియు - గోపాలకులతో కోమరొప్పనాడు - నపారగోవులనెసగమేపుచును - బృందావనంబను పుణ్యదేశమున - మందారచంపకమాధవీవకుళ చందనపున్నాగ సహకారమిళిత - కుందబృందంబులు కొమరుదీపింప - గోవర్ధనముచెంత గోవులను మేప - బోవుచునొకనాడు పొలుపొందమరియు - కాళింగదర్పంబుగడగించుటకు - బాలురతోననెసంకజాక్షుండు - పసులకుమేతలుబహుళంబులును వెసగల్గునేడాడు వేగబోవలయు ననిచెప్పె కృష్ణుతో నవసుహాకి - ననియముచనాసది చాలు లకషపు।

ముత్త్రముపోల్కి యమరినట్లుత్కట్టియనుకరాణించునాజెలనయుద్ధరందన ॥

వ॥ అప్పుడామడుగుదగ్గరికివచ్చి శ్రీకృష్ణుండు బాలురతో నేమను చున్నాడు.

క॥ గోపకులతోడకృష్ణుం, డేపారకవచ్చియందు నెసనెసమదికిన్
గోపాలబాలకులతో మేపులుగలవిందు, పసులమేపుదమనియెన్ ॥

జంపె॥ అక్కసక్కసగదుపులందందిపచ్చికల - జొక - మునగమేయు చును సొంపుతో మెరసెన్ ॥ ౧ ॥ గోపాలులందరును గోవిందుతో గూడి యాచల్దిచిక్కములనటువిడిచినపుడు ॥ ౨ ॥ బంతులుగగూర్చున్న బాలురకునుగృష్ణుండు - వింతకాజల్దులను వేడుకనొసర్చెన్ ॥ ౩ ॥ సద్దులందరుగుడిచి చాలుగానామడుగువద్దజేరి జలమువలసినటుత్రాగిరన్ ॥ ౪ ॥ నిదురపో మునరీతినగడిబాలకులెల్ల భద్రముగ మడుగుదరిబవళించిరపుడు ॥ ౫ ॥ బాలురునుగోవులునుచాలమూర్ఛలనొంద - బాలకృష్ణుడుమూచిబాగుగాలేపెన్ ॥

వ॥ ఆసమయంబున నెటువలెనుండెను ॥

ఏకతాళం॥ అప్పుడు బాలకులందరు లేచిరి - పొల్పుగనిద్రలుపోయిన రీతిన్ ॥ ౧ ఆవేళభాస్కరుడటుపడమటికై వేగమేయతిగెనువింతగనపుడున్ ॥ ౨ ॥ మందలదోలుకమరి శ్రీకృష్ణుడు - పొందుగ రేపల్లెపురము జకరిగెన్ ॥ ౩ ॥

వ॥ అయ్యవసరంబున రేపల్లెవారెదురుగావచ్చిరటయెటువలెను॥

అటతాళం — వేణుగానము వీనులనువిని వేడ్కసేయ తమతమయేని లోచనలందరునుదామెదురుకొనిరి ॥ ౧ ॥ వచ్చిగౌగిటజేర్చి బాలురమచ్చికలతో - నింగ్లకుమచ్చకంతులుదోడ్కొబోయిరిమమతమీరన్ ॥ ౨ ॥ సుందరాంగియశోదగృష్ణునిజూచి వేడ్క - కౌగిట - మందరొద్దరునత్తికొంచనెమగువవేగన్ ॥ ౩ ॥

వ॥ అప్పుడు కృష్ణుని యింటికిదోడ్కొనిపోయిరటయెటువలెను॥

ద్విపద ॥ అంతనాతల్లియు నాకృష్ణునకును ॥ వింతగామజ్జనము వేడ్కతోజేసి పీతాంబరముగట్టి పృథివీశ్వరునకు - ఖ్యాతిగాతిలకంబుఘనతతో

చిచ్చుపైడిపళ్ళెరములో బాయసాన్నములు దడయక బెట్టించదనకుమారు
నకు - నందునిపొత్తుననయమొప్పగుడిచి - పొందుగాదొడపైని పొసగ
నిద్రించె అపుడు గోపికలతో నందరుగూడి - వేవేగబాలురీవిధమెల్ల జెప్ప
మందభామలువచ్చి మరియశోదకును యందరుజెల్పిరియామగువతోడ -
అమ్మరో వినవమ్మ యీకృష్ణుడిపుడు - క్రిమ్మరబాలుర కదుపులతోడ
కాళిందితీరంబుగదలి తాబోయి - కాళితో నచ్చటపసులను నేడు - మేపివ
చ్చినజాడ మేమిపుడు దెలసి - చెప్పెదమిదిమీకు చెల్లబోయమ్మ - నీకొ
డుకుదుడుకులవింతింతలనుచు - మాకుచెప్పగరాదు మానినిమణిరో - ఇ
దిబుద్ధిగాదనిహితవుగాలెస్స - మదిరాక్షికృష్ణునకుమరిచెప్పవమ్మ ॥

వ ॥ అప్పుడు మందభామినులందరు సెప్పినవిని యశోదాదేవివా
రితో నేమనుచున్నది ॥

జంపె ॥ ఊరకయచెప్పెదరు కారుమాటలుసుతుని - దారితెలియక
మీరుతగబల్కదగునే - ౧॥ ఆమడుగుత్రోవ నెవ్వరైన బోవుటకును - భా
మలారాగలదెబలిమిజూడంగనే ॥ ౨ ॥ మాచిన్నికృష్ణుండుమరితోవదా
నెరిగి ఏచందమునబోవు నేణాక్షులారా ॥ 3 ॥ ఊరకేయీరీతికారువాదా
డెదరు - దారిగాదిదిమీకుతరలాక్షులారా -

వ ॥ అనినవిని గోపికలందరుదమతమయిండ్లకుబోయి సుఖనిద్రి
లుపోయిరట అంతట శ్రీకృష్ణుండెటువలెనుండెను ॥

త్రిపుట ॥ అంత వేకువజాము వేళను నలరకృష్ణుడు లేచిగ్రక్కున - తెం
పుతో నాసర్పమును సాధింపదలచి ॥ ౧ ॥ చుక్కపొడుపున లేచికృష్ణుడు
చూడకుండను వీధులందున - గొక్కరోకోయనుచుగూసెనుకోడివలెను ॥
౨॥ కోడిగుయ్యగలేచివేగమె గోపబాలురుదొడ్లలోపలదూడలన్నియువిడి
చిపితికిరి పాడిపసులన్ ॥ 3 ॥ పేరుపేరునబిలచిగోవుల పితికెపాలునుకృ
ష్ణుడప్పుడు - గారవంబున జిడ్డిగుడిచిరిఘనతమీరగ ॥

వ ॥ అట్టిమొఉ నెటువలెనుండిరి.

అర్ధచంద్రికలు — ముద్దువెన్నెలవిశయొద్దికతోకట్టెగ ॥ ౧ ॥ ఊరగా
యలునంజునొప్పగాబెట్టెగ ॥ ౨॥ చిక్కములబిగియించె పెలుగు...

దారిచియుండెను - వనజనేత్రుఁడు మించిదనుచును వరుస వెడలెఁ ॥ ౨ ॥ బాలురందరిఁ గూర్చుకొనుచును బాగుగా మందల నదరుముచు - బాలకృష్ణుఁడు దల్లికినిదా బ్రణతిసేసెఁ ॥

వ॥ అయ్యవసరంబున శ్రీకృష్ణుండు బాలురం గూడుకొని గదలి వచ్చెమార్గం బెటువలె నుండెను ॥

డిండిమను—చల్లని నవరత్న పిల్లఁగ్రోవి చేత మల్లె మొగ్గల దండ మెరిసి గనింప ॥ ౧ ॥ ఉల్లము రంజిల్ల గొల్ల భామలకెల్ల జెల్లుగ యాలలు సెలఁగి పాడుచును ॥ ౨ ॥ అందెలు గజ్జెలు సంకందమ్రోయగ పొందుగ నడిచెను పురుషోత్తముఁడు ॥ ౩ ॥ నల్లని మేఘము నలువొందు మేనితో జెల్లుగ పింఛము సిరమున మెరయఁగ ॥ ౪ ॥ ముల్లోకము లేలు మురవైరి యహ్వానవల్లి పీజనములవారిం వెడలెఁ ॥ ౫ ॥

సీ॥ అంతట శ్రీకృష్ణుఁ డల్లన వెడలంగ సూర్యోదయంబయ్యె సొంపుమీర । కమలముల్ వికసించె ఘనచీకటులు మూసె చుక్కలు మాసెను చొక్కముగను । పక్షులు సెలరేగి బాగుగా గూసెను వృక్షముల్ వికసించె వేడ్కమీర । మధుపానములు జేసి మత్తభృంగంబులు ఝుంకారరవములు చాలఁ బ్రబలె ॥

తే॥ గీ॥ గానసీతి వేడ్కలు గలిగియుండ । బాలురను గూడి కృష్ణుఁడు ప్రౌఢిమీర మెల్ల మెల్లన సఖులతో మెల్ల మెదవ । మాధవుఁడు వచ్చె నప్పుడా మడుగు దరికి ॥

వ॥ అప్పుడు సూర్యోదయంబైన యత్తఱిణం బెటువలెనుండెఁ ॥

త్రిపుట—అరుణభానుఁడు పూర్వదిక్కున నమరియుండిన చందమప్పుడు - స్థిరముగా దేవతలు పట్టిన దీపమనగా ॥ ౧ ॥ తరుణభానుని జూడ నొప్పెను సురలు దేవేంద్రునకు పట్టిన - గురుతరంబుల సూర్యపట్టపు గొడుగో యనగ ॥ ౨ ॥ పదిలుఁడయి కాళింగు నణచను బాలుఁడయి హరి వోవ గని తా- నుదయపర్వత మెక్కె సూర్యుం డొప్పమీరఁగ ॥

వ॥ అప్పుడు శ్రీకృష్ణుండును బాలురును మడుగుదగ్గఱికి వచ్చి యేటువలె నుండిరి ॥

వెకతాళంబు—పచ్చరిపూరియు బలసియుటుంవగ - విచ్చలవిడిగావిడి దనంబటా ॥ ౧ ॥ బంతులునాడుచుపంతములాడుచు - వింతలు సేయుచు వా నసిరియుచటకా ॥ ౨ ॥ వృక్షము లెక్కుచువిరవిరనురుకుచు - బత్తులరీతిగ నరగిరివెక్కి-కా ॥ ౩ ॥ వృక్షములోబలువృక్షముగనుగొని - యూతుణము వనేమబ్బాతుంను ॥ ౪ ॥

వ ॥ ఆసమయంబున శ్రీకృష్ణుండిటువలెనుండెను ॥

జంపె—పీతాంబరమునముమువిగియించికట్టుకొని - ఖ్యాతిగానొక శాఖగ్రక్కునను మెక్కా-కా ॥ ౧ ॥ ఎక్కియంతట చూచిచొక్కముగ మాధవుండక్కజముగామడుగదరిపడదుమికెకా ॥ ౨ ॥ దుమికినంతటజల ముతోలగపాతాళంబు - విమలముగగనుపించె విఖ్యాతముగను ॥ ౩ ॥ శే షుడదరెనుభూమి సెదరిగడగడవణకె భూపాపతికి మంత్రి పఠనములుద ప్పెకా ॥ ౪ ॥ దిక్కులన్నియుజెదరెదెసలు చిక్కులుపడిమ్రొగ్గక్కునను భా నుండుగతిదప్పినడిచెకా ॥ ౫ ॥ సాగరంబులుగలగెసప్తపాతాళములు - వే గిర మొగనుపించెవింతగానపుడు ॥

వ ॥ అయ్యవసరంబున శ్రీకృష్ణుండుమడుగులోపలనెటువలెనుండెను ॥

అర్థచంద్రికలు— బిఱబిఱను జలములో గిఱగిఱనుదిరిగెకా ॥ ౧ ॥ నుడివడినజలములను వడివడిగదిరిగెకా ॥ ౨ ॥ అంతకృష్ణుండేగసిపంతము గదుమికెకా ॥ ౩ ॥ ఈరీతిమాధవుండిట్టట్టుసేసెకా ॥ ౪ ॥ వింతగానెగసెగసియం తంతదుమికెకా ॥ ౫ ॥

క ॥ కరిసొచ్చికమలసరసిని, కరమరుదుగగలచురీతి గమలాక్షుండు న్నొరవకజడియకనప్పుడు, బిరబిరగతిమడుగుజొచ్చిభిన్నము సేసెకా

వ ॥ అప్పుడు కాళింగుడు గోపావేశంబున నమ్మడుగులోనుండి వెడలెనట యెటువలెను ॥

ద్విపద ॥ అప్పుడు ఫణినాథుడాగ్రహోదగ్రి - నిప్పులురాలంగనిద్దగు ద్దునిగుడ భీకరాకారుడై పేర్చి కాలాగ్ని - కాకకునదిమైన ఘనతరోశ్వాస జాలంబునిగుడంగజలంబు ప్రతాప - జాలార్కుపగిదినిపటువిషంబులను - గ్రక్కుచుశ్లోకముగాబ్రెదుపగిది - కోపించికోపించి గాలులువీచ్చి - గ్రి

...లము త్రికము బాత్తుజూచి - రూపించిపడి గెలువో జూము వెడలె ॥

వ॥ అప్పుడు కాళింగుండు కోపావేశంబున నబ్బాలునింజూచి యేమ నుచున్నాడు.

జంపె॥ ఇదివరకు నెవ్వండు నీమడుగు సన్నిగిచి - పదిలముగ రాడు నాభయము దానేగి ॥ ౧ ॥ వీడెవ్వడొక్కండు వెరపింత లేకయును - పోడిమితో నామడుగు పొందుగాజొచ్చెఁ ॥ ౨ ॥ శంకయించుక లేక చాలగర్వము మీరికొంకకనుమడుగిప్పుడింకగావలచెఁ ॥ ౩ ॥ అనిపలికి రోషమున నా కృష్ణుంజేరి పెనగిచుట్టుకబోరెబీరంబుతోడఁ ॥

వ॥ అనిపలికి యివ్విధంబున గాళింగుండట శ్రీకృష్ణుని తోడంబెనం గుచుండ నడ రేపల్లెలోనున్న యశోద మొదలగువారలకవశకునములుగ నిపించెనట యెటువలెను ॥

జంపె—మూకంబులొకకొన్ని గుంపుగూడుకగూసె - గాకములు చెలరేగికలగివాపోయెఁ ॥ ౧ ॥ కమలనేత్రియశోదకన్నులదరగజొచ్చెన మితముగనురగంబులడ్డముగదిరిగెఁ ॥ ౨ ॥ అవశకునములు జూచియామందవారెల్ల। వివిధభంగుల గలగివింతనేడనిరిఇదియేమొయీవింతయీ పల్లెలోనిప్పు - డొదిగియవశకునంబు లొక్కటిగబుట్టెఁ ॥

వ॥ ఇవ్విధంబున నవశకునములంజూచి యందరుగుంపులుగూడుకొని యేమనుచున్నారు ॥

కురుచజంపె—వినరమ్మ యోభామలారా కృష్ణుని వెతకకుండుట మనకు మేరా ॥ ౧ ॥ దిగులుపుట్టెనుమనసులోన నేడంతో మగువలారా యేమి సేతుఁ ॥ ౨ ॥ పొద్దున నేముం దేవరిమోము - జూచితిమొ పొందగలిగెను దానిఫలము ॥ ౩ ॥ వింతగానవశకునములు రే - పల్లెలో - నంతకంతకుబుట్టదొణగెఁ ॥ ౪ ॥ నందుడుసుమందాదులిట్లు - గూడుకొని - యందవిలపించుచుండఁగఁ ॥ ౫ ॥ అందరు వేవెడలిరప్రుడు - యశోదయును - ముందుగానుండి వెతుకుచును ॥

వ॥ అప్పుడునందుండు యశోద మొదలగు రేపల్లెలోనుండు వారందరు వెడలివచ్చుమార్గఁంబెటువలెనుండెను ॥

కట యెటువలెనుండెను ॥

ద్విపద—అక్కడగోవులు నాబాలురెల్ల - బొక్కుచువాపోవభూ మిపైబొరల - గడ్డియునీరునుగవలంబులుడిగి - దొడ్డుగాఘోషించుచూ డలుపసులు - హాకృష్ణకృష్ణయనియందరుగూడి - యేక్రియవచ్చెదో యిందునీవనుచు - బాలిచేబాలురుపలువరింపుచును - వాసిదప్పినరీతివ గలబొందుచును - ఆరీతినుండంగ నాయశోదయును - వారిజాక్షులుదా మువారినిజూచి - ఇదియెల్ల శ్రీకృష్ణుడీమడుగులోన - పదిలుడైదుమికె నేభయమింత లేక - ఇత్తెరంగంతయు నెరుగంగమీరు - నాతోడజెప్పం డునావత్సలార - అనినయశోదకునాబాలురెల్ల - వినుపింపదొణగిరివృ త్తాంతమంత - హనుమంతుడెక్కినట్లాకొమ్మకెక్కి - పనిబూనిదుమికె నుబాలకృష్ణుండు - దుమికెనప్పుడు మేమ[illegible]డర్చిచూచితిమి - మామది నింతైన మేమెరుగమమ్మ - యెరిగియుండితిమేని యీకదంబమున - వంచించికట్టుదుము వద్దనుండుదుము - బుద్ధులుసెప్పుదుముపోలతిమీక డకు - వడివడిగావచ్చివార్తజెప్పుదుము - అనిపల్కుబాలురనాయశో దయును - విసయంబుతోసుతుని వేగమేజూచి - పెనగికృష్ణునిపాముబీ రంబుతోడ - ఘనమైనపడిగెలగరచుచునుండ - చూచికన్నులనీరుజలజ లరాల - నేడీయశోదదానిట్లనిపలికె ॥

వ॥ అప్పుడు తనయునింజూచి యశోద యేమనిప్రలాపించుచున్నది ॥

అటతాళం—సిలవర్ణుడనీదు జాతకమరిసిచూచి - మానులులీలమీ రగజగములన్నియు నేలుననిరీ ॥ ౧ ॥ చిన్నికృష్ణాపాము చేసీవుజిక్కుబడు దు - వనుచువారెన్నరైరోఘునులుమును పెకన్నతండ్రి ॥ ౨ ॥ నిన్నుబాసి కనెట్టులోరుతు నిమిషమైనను నిన్నునిమ్మహి - కన్నులెత్తినన్నుజూడర యన్నకృష్ణా ॥

వ॥ అని మరిన్నేమని ప్రలాపించుచున్నద ॥

జంపె—నాతోడబలుకరా నన్నుమన్నించరా - నాకోడలపై వ్రా లునాముద్దుచిలుక ॥ ౧ ॥ అందెలవియసియాడమందహాసముతోడ - సుం దరాకారనను జూచునాతండ్రి ॥ ౨ ॥ అఘరుపాటునవచ్చి యుష్ట్రనుబట్టు

అర్ధచంద్రికలు — బాలురయతుగుల భావింపుకొనుచుఁ ॥ ౧ ॥ వన
మునయమున తెరువు భావింపుకొనుచుఁ ॥ ౨ ॥ అక్కచక్కని జాబిల్లియుం
దంధవతికి ॥ ౩ ॥ ఏమిసేయుదు కృష్ణుడెంతు గనుపించుఁ ॥ ౪ ॥ ఈకృ
ష్ణునెన్నటికియేనుగనుగొందుఁ ॥ ౫ ॥ హాకృష్ణకృష్ణయనియవని పైబొ
రలుఁ ॥ ౬ ॥ ఏమిసేయుదుమమ్మ యోయింతులారా ॥

వ ॥ ఇవ్విధంబున యశోద ప్రలాపించుచువచ్చుమార్గంబున రోహి
ణీదేవిచేరంజని యూరడిల్లంబలికెనట యెట్లనవలెను ॥

అటతాళం — ఎందుకే యోయమ్మ వగవగనింతసేసు - జెల్లదు పొం
దుగా భయమొందు లేదా పుణ్యాసకును ॥ ౧ ॥ ఆదేవదేవుండైన కృష్ణు
ని దెలియుమిప్పుడునీవ్రను భావమున దలపోయుమమ్మ శంకబాస్కి ॥ ౨ ॥ పు
ట్టినప్పుడే పూతకిని దా బట్టి దానిం జంపడే - దిట్టతనమున శకటుడైత్యుని గొ
ట్టలేదే ॥ ౩ ॥

వ ॥ ఇవ్విధసంబున రోహిణీదేవి చెప్పిన విని మరలక వెతుకబోవుచుమా
ర్గంబున నేమనిప్రలాపించుచున్నది ॥

ఖ్యాలు — మాధవుడేచ్చటనున్నాడో వేదవేద్యుడైన సుతునిపాదు
కొనినీవుబోవవె యోభూమిదేవి - మోదమలర నాకు జూపవే ॥ ౧ ॥ న
ల్లనికాంతులవాని జల్లనిచూపులవాని - యుల్లమలరనీవుబొప్పవె- యో
గగనవాణి కల్లగాదు నాతో తెలుపవే ॥ ౨ ॥ నెమలిపింఛములవానినిను
లవేణురవమువాని - గనులనేత్రములుగలవానిఁ - యోరవింతులారా-
మోదముతో మీరుబోవుడు ॥ ౩ ॥ గోవులనుగాచెడువానిగోవర్ధనగి
రిధరవాని పావనుడైన నాపట్టిని యోదిక్కులారా - కావరేమిరోంద
యూఁడి ॥ ౪ ॥ వెన్నదిన వన్నెగానికన్నులవలపించువాని - చిన్నవాడైన
చిన్నకృష్ణుని - యోతరువులారా - కన్నులారనాకుజూపరే ॥ ౫ ॥ అం
దముసుద్దులుగలసంవదముగ పలుకులవాని - సుందరాంగుండయిన కృష్ణు
ని - యోపక్షులారా - పొందుగానునాకు జూపరే ॥

వ ॥ ఇవ్విధంబున ప్రలాపించుచు వెతుకుసమయంబున బాలురకూ
తలుగోపురవాసులు వినుచిన్నజాడబంధించుగుతు సమ్మానుసేరంజని

కొని - మోదమలరగన్నులను మూయనేగందురా ॥ ౩ ॥ ఇదియెవరునాక
న్నులిపుడుమూసిరియనుచుగది - సిమూపున నెక్కగందునోనేనురా ॥ ౪ ॥
గోవులనుపాలింప గోపకులాలింప రావయ్యనాతనయరమణమైయుందు ॥
శ్లో ॥ నీతోడ లోకమై నేడుమేముండెదము - నాతోడు నీడయని నమ్మి
న్నాను ॥

వ ॥ ఆసమయంబున మఱియు నెటువలెనుండిరి ॥

ఏకతాళం — అంతయశోదయునామడుగుదరికి - వంతముతోవచ్చిప
డుటయుదలచి ॥ ౧ ॥ అందుబట్టలునపుడు బిగ్గించి - పొందుగనడిచిరిపో
లతికిమునుపె ॥ ౨ ॥ మడుగులోబడుటకుమరిడగ్గరిలంగ - వడిగరాము
డువచ్చివలదనిపలికి ॥ ౩ ॥ అడ్డంబుగాజొచ్చి యతడువేగమున - ప్రేమ
తోసంకరిబిలుచుకచనియెరా ॥ ౪ ॥

వ ॥ ఆసమంబున శ్రీకృష్ణుడందరదనమాయచేతమూర్ఛబోవజేసితా
నెట్లువలెనుండెను ॥

త్రిపుట — వంతగించుచుఫణియుగృష్ణునిబడిగెలన్నియు - ద్రిప్పియుగ్ర
త - నంతకంతకుజేరెసుడివడనంగములను - అట్టియెడనాఫణినిగృష్ణుండ
ణచి పట్టియు వివిధభంగుల - వింతగావిదళించివేసెనువేగమునను - దూ
రముగబడి ఫణియునిప్పుడు ఘోరరవమునవచ్చిచుట్టెను - ధీరులై యా
యిరువురొకమొగిబోరిరియుగరా ॥ మునిగినంతటబోకనిరువురుగణనమిం
చినసాహసులునై - ఫణియుగృష్ణుడు బోరిరిప్పుడు వంతమునను ॥

వ ॥ అట్టియెడ మరియు నెటువలెనుండిరి ॥

జంపె — ఇత్తెరంగున బోరి యిరువురొకజాముమరి - ఖ్యాతిగాలోక
ములుగడగడనువణకరా ॥ ౧ ॥ అప్పుడా హరిజూచి యాఫణీశ్వరువాల -
ములకుబట్టుకదిప్పి యిలపైనిల్పైచెరా ॥ ౨ ॥ వేసికృష్ణుడుదానిపీవుపడిగె
లమీదు - దలలపై నెక్కి తాదాండవంబాడెరా ॥

వ ॥ అప్పుడు శ్రీకృష్ణుడు కాళింగునిపై తాండవంబాడెనట యెటు
వలెను ॥

ఝంపెమను — చల్లనిసవరత్న పిల్లంగ్రోవిచేత మల్లెమొగ్గలదంష మ

రిసికొండ ॥ ౧ ॥ తాధిత్తాధిత్త త్తాధిత్తాధిత్త త్తాధిత్తాధిత్త తద్ధిమితక్కిట-పద తాండవంబులపడిగెలపై నుండివివిధముగ నాడేవింతగానప్పుడు ॥ ౨ ॥ తాధిత్తాధిత్త త్తాధిత్తాధిత్త త్తాధిత్తాధిత్త తద్ధిమితక్కిట ॥ 3 ॥ బలుగర్వములణచిపడిగెలపై ద్రొక్కిచలపట్టివాడుడేసేసరిసిజోదరుడు త్తాధిత్తాధిత్త త్తాధిత్తాధిత్త త్తాధిత్తాధిత్త తద్ధిమితకిట ॥ ౪ ॥ గజ్జలుమువ్వలుఘలుఘలు మ్రోయగజిందులుద్రొక్కెనె చిన్నకృష్ణుం త్తాధిత్తాధిత్త త్తాధిత్తాధిత్త ధిత్తాధిత్త తమిద్దక్కిట ॥

వ ॥ ఆసమయంబున శ్రీకృష్ణునిమీద పుష్పవర్షంబుగురిసెనట యెటువలెను ॥

ఏకతాళం—అప్పుడు హరిపై నతివేడుకతో - వారిరపువ్వులవర్షముగురిసెన్ ॥ ౧ ॥ అచ్చరలాడిరి యంబరవీథిని హెచ్చుగవాద్యము లెలముతో మ్రోసెన్ ॥ ౨ ॥ అనువుగతుంబురుడానారదుడును - గనుగొని చేసిరిగానోత్సవముల్ ॥ 3 ॥ దేవతలందరుదివిజయమనగా - భావజు తండ్రియుఫణిపై నాడెన్ ॥

వ॥ అప్పుడు కాళింగుండెటువలెనుండెను ॥

అటతాళం—దానవాంతకుడాడేడిండిమతాళతతుల - ఫణికిని - ప్రాణములునిట్టటు బడిమరిపడిగెలదిరెన్ ॥ ౧ ॥ అదరి శిరములునలగగామరి చెదరేగుడ్లున్ గిఱగిఱబెదరితిరుగగదలచిచాలగభీతినొందెన్ ॥ ౨॥ తెలిసితాగాళింగుడప్పుడు దేవుడనుచు మనమునదలచిభయమునునుండె మరితాదైన్యమంది ॥ 3 ॥

వ॥ అప్పుడాకాళింగుండు దేవదేవునిపరాక్రమంబుదలపొసిఘోషింప దొణంగె నాకవలీయాలకించియంతఃపురంబుననున్న స్త్రీలు వెడలివచ్చిరటయెటువలెను ॥

ద్విపద—అంతగాళింగుని యతివలుదెలిసియంతఃపురంబున నడలుచు వెడలిపన్నగకన్యలుపణతులై దుగురు తిన్నగానడచిరాదీనతనొంది - అన్నులనడుములుహంసయానములు - వన్నెమీరినయట్టివనజనేత్రములు-బింబోష్ఠములుచంద్రబింబాననములు - కెమ్మపండ్లపోల్కి నెగడుపాలిం

డ్లు తిన్నలసమమైన తెరవపిరుదులును - పన్నుగనరటికరంభములగు తొడ లు - రంజిల్లుచీరయురమణమైయొప్పముం జేతికంకణంబులు మెరయుచుం డ నీలంపుకురులును నెగడుముంగురులుచాల చెన్నొందిన సరసవాక్యము లుకలనాగకన్యలుకణగిశోకమున - పలవించివచ్చిరిపాణేశుకడకు॥

వ॥ అప్పుడానాగకన్యకలువచ్చి శ్రీకృష్ణునిపాదంబులకొరగి యేమని పార్థింపుచున్నారు॥

జంపె—శరణునందకుమారశరణుశ్రీశమందారశరణుపాపవిదూరశ రణుగంభీరా - శరణచ్యుతానంతశరణుపరమానందశరణునత్యానందశ రణుగోవింద ॥ శరణుదానవహరణశరణుత్రిభువలభరణశరణుపంకజచర ణు శరణుశ్రీరమణా శరణుసద్గుణజాలశరణు సన్నుతలీలశరణుగోపికలో ల శరణుగోపాలా॥

వ॥ అని మరినేమనికీర్తింపుచున్నారు॥

అటతాళం—ఎన్నిజన్మములెత్తినోకాని యెరుగలేముపతికిని చెన్ను మీరగచిన్నిపదములు సిరసునమరె॥ వారిజాసనుడాదిగాగలవరుసము నులుసురులును చేరికనుగొనలేనిపదములు శిరమునమరె అఖిలలోక ములందుపూజలనందినట్టిపదములుసకలభీకరమైనశిరమునజాలనమరె॥

వ॥ అనిమఱియు నెటువలెగొనియాడుచున్నారు॥

కురుజాపె—పురుషభిక్షముపెట్టియుకనూ - మన్నించు - పురుషోత్త మామమ్ము కృపతో॥ పతిభిక్షముపెట్టి మమ్మూపాలింపుపలుమారు మీకుమ్రొక్కెదమూ॥ ఓదేవకరుణింపుమయ్యా యీవేళమాదేవుడ వుగావుమయ్య మీపాదములశిరములానగ వెలయగనుమాపతికిగలిగెనీ ఫలమూ మాతండ్రిమిముబాగడగలమాయజ్ఞాన - మలముచేమిము తెలి యగలమా॥

వ॥ అని యిట్లనేకవిధంబుల బ్రార్థనజేసి నాగకన్యకల శ్రీకృష్ణు నిజూచి వేడుకొనిరటయెటువలెను॥

ఆ॥ సీ॥ మమ్ము బెండ్లిసేయు మాపాణవల్లభ। బ్రాణమిచ్చి కావుభ క్తవత్సల నీవు సేయుపెండ్లి నిత్యంబు। భద్రంబుచిన్ననాటిపెండ్లి పెండ్లిగ దు

వ॥ అప్పుడు శాంతమూర్తియై గోపాలమూర్తి ఫణతులను గృపజూ
చెనట యెటువలెను ॥

అర్ధచంద్రికలు—ఫణతులగృపజూచిపద్మనాభుండు - మర్దనముచా
లించిమహిమీదదుమికెఁ - దుమికినంతట ఫణియు దొరలిధరబడియొఁ
పడికొంతమూర్ఛిల్లిప్రాణములు దెలసెఁ చె - దరినప్రాణముల జేర్చిపట్టు
చునుహీనస్వరముతోడనిట్లు దేవునకుఁ కరములు మొగిడ్చియాకమలాక్షు
జూచి - ప్రార్థించఁదొణగె నాఫణివరుండపుడు ॥

ద్విపద—దేవజగన్నాథ దేవాదిదేవ దేవకీతనయయోగతిజాలశర
ణు అఖిలలోకారాధ్యయాశ్రితశరణు సకలజీవాధార సర్వేశశరణునిగ
మగోచరవంద్య నిరుపమాకార అకలంకగుణనిధి యబ్జాక్షశరణు మ
త్స్యమైజలధిలో మఱియు వేదములు జొచ్చితెచ్చినయట్టి యచ్యుతశరణు
కూర్మమైకుధరంబుగుదురెత్తినట్టి - వారిజాసనవినుతవైకుంఠశరణు -
వారాహరూపమై వసుధను దెచ్చి పదపడినిలిపిన పరమాత్మశరణు ఇలను
నరహరివిద్యై యలదైత్యుద్రుంచి బాలునిగాచిన బహుపుణ్యశరణు వా
మనరూపియై వసుధయాచించి బలిననంచిన దేవపతినీకుశరణు - పరశు
రాముడవగుచు బహుభూమిపతుల వరుసగాగొట్టిన వైకుంఠశరణు -
దశరథాత్మజుడవై తపనవేషమున - దశకంఠుగూల్చిన దైత్యారిశరణు
బలుడవై తగమించిభానుజుగూల్చి - చెలువమై ప్రబలిన శ్రీధరశరణు
గోపాలమూర్తియై గోవులబ్రోచి రేపల్లెవెలసిన శ్రీపతిశరణు కలికిరూ
పంబవై ఖలులనుద్రుంచి - పలుమారు వెలసిన పరమాత్మశరనుకరిమొ
రవిని యమ్మకరిదుంచి కరిని- స్థిరముగాబ్రోచినశ్రీహరిశరణు - క్షీరా
బ్ధిశాయి లోకేశలోకములరక్షించినట్టి నారాయణశరణు - హీనుండన
నుగావుమినకోటితేజ దానవాంతకమహాద్రిధరానదక్షకేశవమాధవకృష్ణ
ముకుందవాసుదేవమహేశవారిజనాథవాసవార్చిత పాపవటవత్రియజ్ఞ
పాదభక్తోద్ధూతపాపకమూతభాగవతావనభవరోగహరణఆగమవందిత
యపరాధినేను మనమందహంకారమమర్షకోపమున మొనసిమునుజడవం
చుముట్టితి దేవకోపాగ్నివిమయక్కోరలుగల్లుగు - పాపజాతినినన్ను పా

ళించుదేవ - కోరినీవిచ్చినగుణములేకాక వేరొండులవిగావు వేదాంత
వేద్య - శ్రీపాదపద్మము శిరముననుంచునాపుణ్యమెట్టిదో నలినాక్షవినవె స
నకాదులునుగూర్చి చర్చింపలేని - కనుగొనియమరులు గొనియాడలేని
లేని బ్రహ్మరుద్రాదులు భావింపలేని యిమ్మహాపాదంబులేనుగనుగొం
టి - పావనుండనునై త్రిభువిలోననేను - సేవకుంగాజేసి చేపట్టునన్ను - అ
భయంబొసంగియోయవతారదేవ - యుభయవిభూతినాకొసగవే దేవ అ
జ్ఞానినపరాధినతిమూఢునన్ను - సుజ్ఞానిగా జేయుజూడవేకండ్రీ ॥

వ॥ అపుడు కాళింగుడు మఱియు నేమనికొనియాడుచున్నాడు ॥

అష్టకము ॥ సావేరిరాగం——ధరణిభారముదీర్పను - మఱిదైత్యరా
జులదుంపనుధరణిలోవసుదేవునకునుతనయుడై జన్మించియు గరిమతో
డుత నందునింటనుగారవంబున - వెలసిననరవరోత్తమనన్ను బ్రోవవే
నందగోకులనందనా - గోవులనుబాలింపనుమఱిగోపకులలాలింపను సేవ
తోడుతనవతరించక భావమునభూజములచే ॥ సేవితుడవై సట్టియదుకుల
శ్రేష్ఠుడై విలసిల్లిన - నవనిధామనన్నుబ్రోవవె నందగోకులనందనా బా
లుడై పూతకనిబట్టి ప్రాణములవధియింపవా బాలరాక్షసమాయలన్ని
యుసారెసారెకుమాన్పవా - బాలుడనినేనిన్నుసోకి పాపజాతిని సేనయాన
లినలోచననన్నుబ్రోవవె నందగోకులనందనా ॥

వ॥ ఇవ్విధంబున కాళింగుండు గొనియాడిన విని శ్రీకృష్ణుండేమని
యానతిచ్చుచున్నాడు ॥

జంపె ॥ అభయంబులిచ్చితియఖిలలోకంబులను - విభవంతో నీవు వె
లయుమురగేంద్రా ॥ వినుమునీభయమునను వేడుకతో నీదరినిగనుగొనగ
లేరట్టి ఘనులైనగానీ - నీవువచ్చినమొదలునీగైజీవములెల్ల దాపుగని
యీజలముదాగరాకుండుర్ ॥ ఎచ్చోటనుండుదువో యచ్చోటికేపోవు-
మిచటనుండగనీకునేమికారణము ॥

వ॥ ఇట్లు శ్రీకృష్ణుడానతిచ్చిన విని కాళింగుడేమనుచున్నాడు ॥

త్రిపుట—దేవమునునేనుండు లవణద్వీపమందునసర్పరాజై - కావ
రంబువైనతేయునిగదసిపోరని ॥ వానిబలిమికినిలుపజాలకవచ్చివేగమేము

మడుగుజొచ్చితి పొంగిగరుడుకిందఃజరియింపంగరాదూ - వైనతేయునీడ సోకినవ్రయ్యలై పడుమనుచుతనునిర్ణ గనుచునొకముని శాపమిచ్చెనుగ రుణలేక అప్పుడిట్లని శుకులుజెప్పిన నతనితో నారాజువేగమెనిపుణుడై తామొ్రక్కిపలికను నేర్పుమీరగ విసగవినగనువేడుకయ్యెడువిష్ణుకథ లు చెవులకుతనకుతెలియగనానతియ్యవె తపసివర్యా॥

వ॥ ఆసమయంబునం బరీక్షిన్నరేంద్రుండు శుకబ్రహ్మర్షినింజూచి గరుడునికిం గాళింగునికి విరోధంబెట్లుగలిగె గరుడునికి శాపంబెవరిచ్చిరి గాళింగునకు శాపమువచ్చిన కతంబెద్దియది విశదంబుగా నాకానతిండన నాన రేంద్రునితో మునీంద్రుండేమనుచున్నాడు ॥

అటతాళం—వినుము లవణద్వీపమందున వెలయుచున్నజాతులు - వైనతేయుడునచటనుండురు వయిభవమునా ॥ నెలకునెలకును వైనతే యునకెలమినాహారం - బొసంగియు - నెలమితోడుతబుత్తురతనికి యుత వుగాగ ॥ చలముజేగాళింగుడనినిసడ్డసేయకుండిన నలగిఖగపతియతని పైబడియపుడుగినిసెగ ॥ రెక్కలునుగొనిచరచిబలిమినిముక్కుతోడగ జీరెను మక్కువతో వాడందఃనిలువకమడుగుజొచ్చెగ ॥

వ॥ అప్పుడు కాళింగుండు మడుగులోసం బ్రవేశించి యెటువలె నుండెను ॥

ద్విపద—అప్పుడాయురగేంద్రు డాహారకాంక్షమచ్చికతో నొకమ త్స్యమునుబట్టి - నటువేగమునమ్రింగిబలిమినిపుడు - నెట్టనువెడలెను నీటిలోనుండి యామత్స్యబఃగంబు లతిసంఖ్యలగుచు - నామడుగులో నుండి ఆర్చుచువెడల - ఆదరనొకమునియాఘోషమరసి - మనమునగో పించి మఱియిట్లుబలికె ఓదురాత్మకమోడకనీవు - పారవచ్చితివియూప క్షేంద్రుడుకతనవచ్చి నాయాజ్ఞనువారించిమించిచొచ్చి యీమడుగులోసా రమీనునొకటి - పట్టుకమ్రింగితి పాపకర్ముడవు - గానగరుడునీడమేని పైసోక పడగలువ్రయ్యలై పడుమనుచునపుడు - తడయకశాపంబుదగ నిచ్చె నతడది మొదలు కాళింగుడామడుగులోన ॥ బదిలుడై దాగుండె ప ఃతులు దానుగరుడుడాతీరమున గర్వంబుమెఱసి చెరియింపుచుండెనుహా

లవేమకలమునిసన్నిధిని నొక్కఘనవ్రతమునను దినమునాహారంబుదిన
దెచ్చుకొనుచు - భక్తింపజూచి యాబ్రహ్మణోత్తముడు - పక్షీంద్రోని
పుమరిబహుమానములను - మాసన్నిధికిదెచ్చి మనకితము సేయ - భా
నురంబుగనలదు పలుమారునీకు అనుచుచెప్పగ వినకనాగ్రహంబునను
చలముసేయగజూచి సంయమివరుడు - పక్షీంద్రయీదరి ప్రబలివచ్చితే
ని పతమువ్రీలిగిచటబడుమనిశపించె మునిశాపమందుకొనిమనమున వెర
చిఖగనాధుడేగ నక్కడనిల్వలేక - అనుచునాశుక యోగియంతయుదెలి
య - దప్పకవినుపించె ధరణీశునకును యిదినీకుజెప్పితినికమీద వినుము
ముదముతో వినుపింతుముందరికధయు అవనీశనీకునుహరిచరిత్రంబు వివ
రించితెలిపెదవినుమనిపలికె కాళింగుడపుడు గడుదీనవృత్తి బాలకృష్ణుని
పాదపద్మములబడియు - మనమునహరినిల్పిమరియూరకున్న - గనుగొని
కృష్ణుండుగరుణతోబలికె ॥

వ॥ అయ్యెడ శ్రీకృష్ణుండు గాళింగునితో నేమనుచున్నాడు ॥

క॥ ముదముననాపదములుదల, బదిలముగా వెలయుచుండబక్షీంద్రుం
డన్ । గదియంగ వెరచుగనుకొని, కదలుము నీపురికి యనెనుగమలా
క్షుండున్ ॥

వ॥ అప్పుడు శ్రీకృష్ణుండు మరియు నేమనియానతిచ్చెను ॥

దంపె—పుణ్యచరితంబిదియు పాపచరితంబిదియు - యిదిదేవమంత్ర
మిదియిహపరంబులకూ ॥ ఇలలోనుభక్తితోనేఘనులుచదువుదురో - య
నఘువారలజలిమినంటకుమునీపూ॥ కాళింగయీకథనుగరుణతోనేవరేని
యిలనుపాడినమరియు నెలమివ్రాసినమూ అనుదినమువిన్నను యధిక
లై వెలయుదురు - హరిలోకమునువారలందియుండుదురూ ॥ ఆయురా
రోగ్యంబులష్టసంపదలకును - బాయకనుయుండునా పావనులయిండ్లన్ ॥
చాలసంతోషముబు సౌఖ్యంబులును గలిగి బాలురను గోవులను బాగు
గావెలయున్ ॥

అటతాళం—అనుచుబ్రీతినియానతిచ్చిన హరినిజూచి - యప్పుడు -
వినుతిజేసిరినాగకన్యలు వినయనితోడన్ - దేవనీమహిమంబుదెలియగ దివి

శార్దూలము - బాలరు భావమునగనుగొనగజాలడు పద్మజుండహా॥ దివిజుల్ గోర్కులుదీరధన్యులమైతిమనుచు - మీరలు - నేమమున సమాగ్రహా తమునకుని చ్చేయుడనిరీ ॥

వ॥ అనవుడు శ్రీకృష్ణుండు మహాసంతోషంబున గాళింగు నగరంబునకు వేంచేసెనట యెటువలెను॥

ఏకతాళం—ఇంపుగగృష్ణుని యింటికితోడుక - నేపారగజనిరింతులు వేడ్క ॥ బంగరుపీఠముపయి హరినునిచిరి పొందుగజేసిరిపూజలతనికి॥ శృంగారంబుగసంగనామణులును - శృంగారించిరిచిన్నికృష్ణునికి ॥ కుండలములువరకోటితేజములగుదంశకిరీటముదగవుగనిడిరీ ॥ బంగరుగజ్జెలు స్పైడంజెలుమరిరంగుగమొలనూలంగుళకములుఙ ॥ సందిటతాయెతులందముగలిగిన - శిస్తులమర్చిన కౌస్తుభమనియుఙ ॥ పులిగోర్పతకములాలి కంకణములు తళుకుమణులుమించు తాళబిళ్ళలనూ మంచిగశృంగారించిరిమగువలు - లేటముత్యాపుసరుల్ దేవ్రులకపుడుఙ ॥ కనకాంబరములు ఘనమణిసొమ్ములు - గనుగొనియిచ్చిరి గానుకగాను ॥

జంపె—అంతశ్రీగృష్ణునకు నావేళభక్తితో - నేర్పైనమన్ననతో నెలమివేడుకగా పన్నీరుగంధంబుబాగుగా నలదుచును - తిన్నగాకస్తూరి తిలకమిడిరపుడూ ॥ గంధాక్షితలచేఘనునిపూజించిరి - సుందరాంగులందారుచూచి శ్రీహరికి ॥ తమదృష్టితగులునని దాసవారికివేగమగువలందరుగూడి మాటిమాటికినీ ॥ వింతగాహారతులువేడుకలరంగదెచ్చి - ముత్యాలహారతులు ముదముతోనిడిరీ ॥ అంగనలుశోభనములపుడుపాడుచు తెచ్చి - మంగళముపాడిరామాధవునిజేరి ॥

వ॥ అనమయంబున నాగకన్యకలుశోభనములుపాడిరటయెటువలెను॥

శోభనపుపాట—శోభనసుదేవకీ - సుతుండయిన దేవునకు - శోభనముగుణనిధికి శోకాపహారునకు శోభనమే - పరిమపావనునకును పంకజ నేత్రునకు పరబ్రహ్మయునదినునకు కనకాకారునకు ॥ శోభ ॥ నందకుమా

స్తుండు - బాలురతో గూడి బంతిగూర్చుండ - నాలయశోదయు సరగున
నపుడు - చిక్కంబులన్నియు జక్కగా విడిచి - గ్రిక్కున నడ్డించె గలవం
టకములు ॥ ఊరగాయలతోడ నొప్పమీరంగ మారు వడ్డించెను మదిరాత్రి
యపుడు - బుజ్జగింపుచు సుతుని పొల్పు మీరగను - బొజ్జనిండగ గుడిపె పు
రుషోత్తమునకు - భానుడప్పుడు గ్రుంకె పడమటదెసనూ - మానుగ మం
దలు మరిదోలుకొనుచు - వేణునాదము చెలగ వేడ్కతో నపుడు - జాణు
డై ముందర సఖులతో నడిచె - ప్రొద్దుపోవగ జూచి పురము వారెల్ల - వడి
వడి నడకతో నచ్చి రా పురికి ॥

వ॥ అయ్యవసరంబున రేపల్లెనున్న శ్రీకృష్ణునకు గోపకన్యకలు దృ
ష్టిపరిహారముగా హారతులిచ్చిరట యెటువలెను॥

మంగళము — రామునకు లోకాభిరామునకు యదు
వంశసోమునకు బాహుబలభీమునకునూ - శ్యామునకు భక్తపరిపాలున
కు భద్రగిరిధామునకు కారుణ్యధామునకునూ ॥ జయమంగళం ॥ సారు
నకు దురితసంహారునకు నూపజతమాపునకు గుణమణీహారునకు • మేరుసమ
ధీరునకు వేదాంతసారునకు సుగుణాలవాలునకునూ ॥ జయ ॥ బాలున
కు గరుణాలవాలునకు కనకమయచేలునకు భాగవతలోలునకునూ - బా
లునకు గోపికాలోలునకు దయచేయ కాలునకు వేణుగోపాలునకునూ ॥
జయ ॥ కృష్ణునకు సురవైరి జిష్ణునకు ద్విజసురో - చిష్ణునకు క్షేమంకరిష్ణు
నకునూ - విష్ణునకు బాలార్కధిష్ణునకు సద్యోగ - రిష్ణునకు భువనవర్ధిష్ణున
కునూ ॥ జయమంగళం నిత్యశుభమంగళం ॥

వ॥ అట్టిమెడ సూర్యాస్తమయంబాయెనటయంతట వారువారు పు
రంబునకు పోయిరట యెటువలెను ॥

సీ॥ అనవుడు శ్రీకృష్ణుడా మందవారెల్ల మెచ్చిక రేపల్లె వొచ్చిరపుడు-
తమతమవీధుల తమమందిరములకు బాలురగోవుల దోలి విడిచి ఆరాత్రి
యందవరు నతిసంభ్రమములతో వెలయుండిరి ప్రజల్వేడ్క మీర మాధవ్వు

ఆవేళమజ్జనంబొనరించి భోజనంబులుజేసె పొందుగాను - గానసీరీతిదినములుగడుపవలయు - మానవేశ్వర కృష్ణుండు మహిమనరకరుణాసీరీతి బాలురగలసియాడు - వినుము రేపల్లెలోహరి వెలసియుండు ॥

అటతాళం—ధరణిభారముదీర్చుకొరకై దానవారి - బాలుడై ధరణిలోనీరీతి వెలసెను ధర్మమూర్తి ॥ దుర్జనులశిక్షించి తనుసద్దోషముగను - నమ్మిన సజ్జనులపాలింపుచుండెను చాలవేడ్క - అందముగ రేపల్లెవాడలోనందకిని - వేడుక పొందుగా వర్తింపుచుండెను భూవరేణ్యా ॥

ద్విపద—అనిరుద్ధ్రుకి మనోహరునిపేరఘనుడైన యదువంశగంభీరు పేర - దేవకీసుతువాసుదేవునిపేరగోపాంగనగోపాలుపేర - నగధరు పేరపన్నగతల్పుపేర - నిగమగోచరుపేర నిఖిలాధారుపేర - అండజవాహనర్యంకునిపేర - గజరాజరక్షణగంభీరుపేర - నీలనుతిరునలికేళినేలమి వేడుకల - చరియించుహరిపార్థసారథీపేర - సంకీర్తంబుగదత్వదాత్యంత నియతి - పంకజాక్షునిపాదపద్మ సేవకుడు - సన్నుతిమీరంగసరసుడో యనగ - వన్నెగానరసింహవరపాలితుండు - సనుష్ణవ శ్రీఘనదా సుడనగ కామతేజుండు వేంకటపతికవిని - చాలంగశ్రీపార్థసారథీకరుణ - లలితమాశబ్దార్థరమణమైయొప్ప - రమ్యమైనవర సాలంకారసరణి - కమనీయమై యీకాళింగుకథయు - యక్షగానంబునిక్షతోజేసి - సరసవాక్యంబులజాలవేడుకల - పరమాత్మశ్రీకృష్ణుపాదంబులకును - పరమభక్తినిసమర్పణముగానించి- వివరించితినికథ విఖ్యాతివెలయ విబుధశ్రేణికిసంస్తుతతరమగుచు - ధరణిలోనాచంద్రతారకంబగుచు - నుండగాపుత్రకృష్ణమండనంబగుచు ॥

కాళింగమర్దనము - యక్షగానము,

సంపూర్ణము.

# ప్రకటన.

గోదావరిజి॥ కాకినాడనగరమునందువద్ద నె 1862వ యింటియందుంచబడిన శ్రీ వేంకటేశ్వర విద్యాసాగర ప్రెస్సు మేనేజరు అందు బుక్కుసెల్లరునగు నావద్ద తప్పులులేకుండ మంచికాగితములపైని ముద్రించబడిన అనేక సంస్కృత - ఆంధ్ర వచన పద్య దండక । యితిహాస పురాణ కంపెనీనాటక వీధినాటక పెద్దచ్చు శతకములు వగైరాలు సరసమైనధరలకు విక్రయించబడును. కావలయువారలు నాపేరును కనుక్కొని కొనవలయునని కోరుచున్నాను

ఇట్లు విధేయుడు,

మంగు వెంకటరంగనాధరావు.

